Registered No. M-4484.

# యుద్ధ సంచిక

వాల్యుం II.] 1942 వ సం॥ సెప్టెంబరు నెల 18 వ తేది శుక్రవారం [నె 37 రు.



*

బ్రిటిషు నౌకాదళం, దానికి తోడుగనున్న విమానదళం కలసి హిట్లరు దిగ్బంధనం ఎత్తులు సాగనివ్వలేదు. ఒక బ్రిటిషు విమాన వాహక నౌకమీదనిలుస్తే దూరన యుద్ధనౌక అగపడుచున్నది.

*

## భారత నగరాలకు బెలూను రక్షణ.

ఇండియాలోను సింహాళమునందును సముద్ర తీర నగరాలందును, యితర ముఖ్య నగరాలందును శత్రు విమానాలు దైవు బాంబింగు జరుపకుండుట వారించుటకును అతి దిగువగ ఎగురకుండుటకును బెలూను రక్షణలు యేర్పాటుచేయబడినవి. కొన్నిచోట్ల బెలూనులు అపుడే చాలమంది వింతచూపులను ఆకర్షించుచున్నవి. కొద్ది వారాలలో యితర ముఖ్యనగరాలపైనగూడ బెలూను బారేజీలు తయారుకాగలవు.

గత మూడేండ్లు ఇంగ్లాండులో మంచి అనుభవంగలవారిలో ఉత్తములు ఇండియాలో యిపుడు బెలూను బారేజీలందును రాయలు విమానదళమునందును ఉద్యోగులుగ పనిచేయుచున్నారు. ఒక బెలూను స్క్వాడ్రనులో ఉద్యోగులందరును లండను బారేజినుండి వచ్చినవారే. ఇపుడు ఇండియాలోనున్న బెలూను బారేజి లన్నింటియందు బ్రిటిషు రాయలు విమానదళమునందు బాగా శిక్షణపొందిన వారే వచ్చియున్నారు.

భారతీయ సైనికోద్యోగులను, సైనికులను బెలూను సర్వీసునందు చేర్చి పని నేర్పించుటకు యేర్పాటులు చేయబడినవి. త్వరలో వీరు బ్రిటిషువారి ప్రక్కప్రక్కనయుండి బారేజిల పని చేయుచుందురు.

ఇండియా సముద్ర కోస్తాయందు నౌకలు ప్రయాణంచేయుటకుగూడ బెలూనుల రక్షణ అవసరం. ఇంగ్లాండు ఉత్తరసముద్రమునందు పయనంచేసిన వర్తక నౌకల కెప్టనులు, విమానాలు దిగువగవచ్చి తమను బాంబులతో కొట్టకుండా బెలూను బారేజీలు ఎంతో తోడ్పడినవని చెప్పియుండిరి. అట్టి బెలూను రక్షణయు రాయలు విమానాల ఫిరంగుల రక్షణయు యిపుడు ఇండియా తీరపు నౌకాయానమునకు ఒసంగబడుచున్నది.

## జపానీయులకు ఆశ్చర్యం

విమాన యుద్ధమునందు బెలూను బారేజి చాల యుపయుక్తమయినదని యిపుడంతట గుర్తించబడినది. సింహళములో ట్రింకోమలీ రేవుపై జపానువారు దాడిచేసినపుడు యీ బారేజి చాల జయప్రదముగ దాడిని వారించెను. శత్రువు లపుడు చాల విస్మయంచెంది కష్టపడిరి.

యుద్ధానికిపూర్వం కొందరు బెలూను లాట్టే ఉపయోగపడవని అనుమానపడుచుండిరి. జర్మనులు పెద్ద దాడులు ప్రారంభించినపుడు యీ బెలూను రక్షణలు వారికి నిరోధములుగనుండి, యీ అనుమానం నిరాధారమని రుజువయింది. బెలూను బారేజిలు యెక్కువ చేయబడినవి.

## బెలూను బారేజి రక్షించే విధం.

బెలూనుల ముఖ్య కర్తవ్యం విమానాలను నాశనంచేయడంకాదు. శత్రువిమానాలు అకస్మాతుగ డైవుబాంబింగు చేయకుండాను, అతి దిగువగ ఎగిరి కొట్టకుండాను వారించగలవు బెలూనులు గాలిలో తేలుచు ఒకచోట నిలకడగ నుండును. అటువంటివి నాలుగైదు నాలుగుమూలల ఎగురుచు వాటిమధ్యను తివ్వలను వలవలె పట్టియుంచును. అతివడిగా పోవుచుండు వైమానికులకు ఆ తివ్వలు అగుపడవు. అందుచే బెలూనులున్న చోట అతడు చాలఎత్తుగ ఎగురకతప్పదు. అంత ఎత్తునుండి వేసిన బాంబులు గురితప్పి దూరంగా పడును. బెలూను బారేజి మధ్య చిక్కుకొనిన వైమానికుడిపని చాల చిక్కుగ నుండును.

బెలూనులలో పనిచేయు సైనికులు నేల సైన్యాలతోబాటే మంచిశిక్షణ ఒసంగబడుదురు. వారి బెలూను శత్రువశమగునట్టి ప్రమాదం సూచింపబడగానే వారు కేబిలుతివ్వ త్రెంపుటతో దానిని త్వరగపేల్చి, తాము చేతిబాంబులు తుపాకులు ఫిరంగులు ధరించి నేల సైనికులవలె సమర్థతతో యుద్ధంచేయుదురు.

## అమెరికానుండి సందేశాలు.

బ్రిటనుకొరకు జరిగిన యుద్ధంయొక్క రెండవ వార్షికోత్సవం సందర్భమున అమెరికా సంయుక్తరాష్ట్రముల విమానదళముల సేనాధికారి లెఫ్టనెంటు జనరలు హెచ్. హెచ్. ఆర్నాల్డుగారు బ్రిటిషు విమానదళాధికారి యగు ఎయిర్ చీఫ్ మార్షలు సర్ ఛార్లెసు పోర్టాలుగారికి యిట్లు సందేశమంపిరి :—

“ బ్రిటను యుద్ధమునందు అద్భుతంగా పొందిన విజయంయొక్క రెండవ వార్షికోత్సవంనాడు రాయలు విమానదళ వైమానికులను అమెరికా సైన్యంలోని వైమానికుల తరపున అభినందించుచున్నాను.

“ 1940 వ సం॥ సెప్టంబరు 15 వ తేదిన ఆర్.ఎ.ఎఫ్. వైమానికులు రాయలు నేవి నేల సైన్యాల సహాయంతోకూడ 185 శత్రు విమానాలను కూల్చియుండిరి.

“ ఆనాటి మీ వైమానికుల చర్యలు యుద్ధగతిని మార్చివేసి, ప్రపంచాన్నంతా ఆక్రమించగలమనే నాజీల ఆశను అడుగంటచేసి, సంయుక్తరాజ్యాల విజయాన్ని దృఢపరచినవి.

“ స్వాతంత్ర్యం విజయంబడయుటకు ఆనాడు ఆనందంగా ప్రాణత్యాగంచేసిన వీరుల గౌరవార్థం స్వాతంత్ర్యప్రియులంతా అన్నిచోట్ల నేడు ఉత్సవాలు చేయుదురు. ”

ఎయిర్ చీఫ్ మార్షలు సర్ చార్లెసు పోర్టలుగారు యిట్లు బదులు చెప్పిరి :—

“ సౌహార్ద్యంతోకూడిన మీ సందేశం చాల ప్రశంసింపబడినది. అమెరికా విమానదళాలకు మా దేశంలో సుస్వాగత మొసంగుచున్నాము. అపుడే వారీదేశమున ఘనకార్యములొనర్చి వన్నెకెక్కుచున్నారు

“ ఆనందోత్సాహములతో వారి వృద్ధిని గాంచుచున్నాము వారిశక్తియు మాశక్తి రష్యా శక్తితో కలసినచో శత్రువులను పూర్తిగ నాశనం చేయగల్గుదుము ”

# ఇండియాలో ధాన్యం పంట సరిపోవునట్లు చేయుట.

## పంటదారుల సహకార సంఘాలు పెరగాలి.

అదివరకు బర్మా, ఇండో-చీనా, తాయిలండుల నుండి ఇండియాకు బియ్యం దిగుమతి అగుచుండేవి. అవి యిపుడు నిలచిపోయినందున వాటికి బదులుగా దేశంలో పంట ఎక్కువచేసుకొనే విధానం ఎగ్రికల్చరలు మార్కెటింగు డిపార్టుమెంటువారి వార్షిక నివేదికలో సూచింపబడెను.

బియ్యం పండించడంలో ఇండియాది ప్రపంచంలో రెండోస్థానం అయినా, ఏటేట ధాన్యం, బియ్యం కొంత విదేశాలనుండి ఇండియాలోకి దిగుమతి అగుచునేయున్నవి. 1937-38 సంవత్సరమున ఇండియానుండి 29,530,000 టన్నుల బియ్యం ఎగుమతిఅయినవి ; 1,398,000 టన్నుల ధాన్యం బియ్యం ఇండియాలోకి దిగుమతి అయినవి వెరసి ఇండియాలో 30,678,000 టన్నులు రూ 292 కోట్ల విలువగల ధాన్యం బియ్యం ఉండెను.

ఇండియా స్వయంసమృద్ధిగా నుండాలంటే వ్యవసాయ పద్ధతులు మార్చి, మంచిరకం విత్తులు వేసి, ప్రతిఎకరంలో పంట యిదివరకుకన్న ఎక్కువ చేయాలి. 1938-39 సంవత్సరంలో ఇండియాలో ఎకరానికి సగటున 781 పౌనుల బియ్యం పండేవి. విదేశాల సంఖ్యతో సరిచూచిన యిది అవమానకరంగావుంది. 1936-37 నుండి 1938-39 సంవత్సరములవరకు మూడేండ్లు సగటున ఎకరానికి అమెరికాలో 1,481, జపానులో 2,307, ఈజిప్టులో 2,079, ఇటలీలో 3,000 పౌనులు పండేవి.

రయితులకు డబ్బు మదుపుయివ్వడం ఎక్కువ శ్రద్ధగాచేసి, వారు పండించే సరకు మార్కెటులలో బాగా విక్రయించే సదుపాయాలు చేస్తే, వ్యవసాయదారుడు విక్రయించగ వచ్చిన డబ్బులో యిప్పటికన్న ఎక్కువ భాగమును పొందగలడు. మదుపెట్టడానికి, నిల్వచేయడానికి, మిల్లులో దంపించడానికి పంటదారుల సహకార సంస్థలు ప్రత్యేకంగ ఎక్కువగా స్థాపించబడవలెనని, సదరు నివేదికలో సూచింపబడెను.

ధాన్యంలో రకాలు నిర్ణయించి విక్రయించడం పంటలు పండించువారికే ఎక్కువ లాభంగానుండును. ఎ జి మార్కువేసి రకంవారిగా విభజించే యేర్పాటులు లాభకరంగానే యున్నాయని నివేదికలో తెలుపబడెను.

---

# బ్రెస్టు, డంకిర్కుపై బాంబులువేసిన భారతీయ వైమానికుడు.

## ఫ్లయింగు ఆఫీసరు, షాహిగారు.

లాహోరు నివాసియగు ఫ్లయింగు ఆఫీసరు ఆర్. ఎస్. షాహిగారు రెండేండ్లక్రిందట విదేశాలలో పనిచేయ చేరిన భారతీయ వైమానికులు 24 గురిలో నొకరు. ఈతడు బ్రెస్టు, డంకిర్కు నగరాలపై బ్రిటిషు విమానదాడియందు పాల్గొనెను.

తాను మొదటిసారి చేసిన బ్రెస్టుపై దాడి, జర్మను యుద్ధనౌకలు 'స్కారనుహారుస్టు, గ్నేసినావు'లపై జరిపిన దాడిగురించి షాహిగారు యిట్లు దెలిపిరి. వారు నడపుచుండిన బాంబరు విమానంలో తోడివైమానికుడు మరొకడుండెను.

"బ్రిటిషు విమానాలనేకం బయలుదేరెయి. అందు మాది వెనుకనుండెను. మే మాచోటికి పోవుసరికి అంతకుముందే హాలిఫాక్సు విమానాలు యుద్ధ నౌకలపై బాంబులువేయుట చూడగల్గితిమి. మావెంట కాపలాయున్న ఫైటరు

విమానాన్ని శత్రు విమానాలు అడ్డినని. మా చుట్టు ఉభయపక్షాల విమానాలు డీకొని "కుక్కలపోరు" జరుపుచున్నవి. ఈ ప్రాంతాలలో యిదివరకెన్నడు ఎదుర్కొనటువంటి నేల ఫిరంగి గుండ్లను యీసారి ఎదుర్కొనవలసి వచ్చెనని అదివరకు వచ్చిన వైమానికులు చెప్పిరి. అయినను మేము వాటిమధ్యనుండియే పోయి, జట్టు విడకుండానే అనుకున్న సమయానికే, ముందేర్పాటు చేసుకున్న స్థలంలోనే బాంబులు వేసి, తిరిగి విమానాల జట్టు విడకుండానే, స్వస్థానం చేరుకుంటిమి. నేను నేలచూచుసరికి నౌకల నుండి పొగవచ్చుట కన్పడెను, మేము తీసిన ఫొటగ్రాపులబట్టి మాబాంబులు గురితప్పకుండా పడినట్లు తెలిసెను.

"ఇది నా రెండవదాడి ; మొదటిదాడి చేసినపుడు కొంచెం భీతిగానుండినను యీసారి చాల ధైర్యంగానుండెను. నిజానికి చాల వినోదంగా నుండెను ! మా కెప్టనుకి డి.ఎఫ్ సి. బిరుదు వచ్చినందున యీదాడంటే నాకు గర్వంగా వుంది.

### రాత్రి దాడి

ఫ్లయింగు ఆఫీసరు షాహీగారు మొదటిదాడి రాత్రియందు డంకిర్కు రేవుపై చేసిరి

"ఆ రాత్రి పూర్ణచంద్రుడుండెను. జర్మను దూర్భిణిదీపాలు నేల నెక్కడనున్నాయో మా కగుపడుచుండగా మేము ఇంగ్లాండు తీరం దాటితిమి. డంకిర్కు నగరంపై కాంతిగూడ దూరానికి అగుపడుతున్నందున ఆ నగరంలో దీపాలార్పడం, ఎ.ఆర్ పి. లేదేమో ననుకొంటిని.

"ఆ ప్రదేశంపై దాడిచేసిన ఆఖరు విమానం మాదే. అనేక దూర్భిణిదీపాల కిరాణలలో మేము తగుల్కొంటిమి. మా విమానం తోక భాగంలోనున్న ఫిరంగి సైనికుడు, మమ్మొకశత్రు విమానం వెంటాడుతున్నదని తెలిపెను. అందుచే మేము తప్పించుకొనుటకు దిగువకు ఎగిరి సముద్రంవైపు పోతిమి. రెండోసారి నగరంపై పోయి, బాంబులు పడేసి, భద్రంగా యిల్లు చేరితిమి.

"బ్రెస్టుపై దాడిలో మా విమానానికి 11 గుండుదెబ్బలు, డంకిర్కు దాడిలో 7 కన్నాలు పడ్డాయి."

షాహీగారు అదివరకు ఇండియను నేషనలు ఎయిరు వేసులోనుండి, ఉత్తర హిందూస్థాన విమానసంఘంలో ఉపాధ్యాయులుగ నుండిరి. ఇంగ్లాండులోనున్న 19 నెలలలో రాయలు విమాన దళంలోని క్రొత్తరకం బాంబరు విమానాలన్ని నడుపుటయం దనుభవం గడించిరి లంకాస్టరు రకం విమానాలనుకూడ నడిపిరి. లంకాస్టరు విమానదళంలో వీరు కెప్టనులుగ నుండిరి అందు కనడా దేశీయుడు, న్యూజిలండు దేశీయుడు ఫిరంగులు ప్రేల్చేవారుగ నుండిరి

### బ్రిటిషువారి ఔదార్యం

ఇంగ్లాండులో భారతీయ వైమానికులకును తనకును ఆంగ్లేయులు చూపిన ఔదార్యమును కొనియాడిరి. అందరు తమను ఆహ్వానించుచుండిరి. ముఖ్యంగా చెప్పుకోదగ్గది రాజుగారు రాణీగారు విండ్సరు కోటలో తమకందరికి చేసిన అల్పాహారముల విందు.

"రాయలు విమానదళమువారు, బయటవారు గూడ చాల ఔదార్యంచూపి, పైదేశంలో ఉన్నామనే భావం మాకు కలుగకుండా చేసిరి ప్రభువుల సభలో రెండుసారులు నాకు అల్పాహారపు విందొసంగిరి నేను కామన్సు సభకూడ చూచితిని. ప్రతిచోట మాకు మర్యాద జరిగెను.

"రాయలు విమానదళమునందు ఉద్యోగులగు బ్రిటిషువారు, న్యూజిలాండర్లు, కనడావారు, ఆస్ట్రేలియనులు మమ్ము సోదరులుగ చూచిరి. స్ట్రెయిట్సు సెటిల్మెంటు స్క్వాడ్రనులో నేనొక్కడినే భారతీయుడను."

షాహీగారు తన వైమానిక జట్టు సుప్రసిద్ధమగు ఆన్సుబెర్గుదాడి జరుపుచుండగా తాను ఇండియాకు రప్పించబడితినని విచారించిరి.

షాహీగారు ఇండియను ఎయిరుఫోర్సులో 1940 ఆగస్టు మాసమునందు చేరిరి. ఇపుడు ఇండియాలో పనిచేయుచున్న ఒక స్క్వాడ్రనులో ఫ్లయింగు ఆఫీసరుగ నున్నారు.

# హిట్లరు చేసే నాజీ యజ్ఞం.

రష్యాలో స్టాలినోగ్రాడువద్ద యుద్ధం ఆఖరు దశలోకి వచ్చిందని వార్తలు వచ్చాయి కాని, రష్యాలో యీ శీతకాలంలో తిరిగి జర్మనుసేనలు చలికి నిలువగల్గుటకు జర్మను సేనలకు కావలసిన బందోబస్తులన్నియు చేయబడుచున్నవనికూడా వార్తలు వచ్చాయి కనుక యీ రెండు వార్తలను సమన్వయించి చూచుకోవలసియున్నది. స్టాలినోగ్రాడు చాలా గొప్ప ఆయువుపట్టు అది జర్మనుల చేతులలో చిక్కుటవల్ల కాకసను పరగణాను జర్మనులు ఆక్రమించుటకు అవకాశం చక్కగా లభిస్తుంది కాకసను పరగణాలో విశేషమైన అనేకమైన ఖనిజముఖు, సమస్త లోహములు సమృద్ధిగా లభించే గనులు ఉన్నాయి కాకసను పరగణాలో పశువుల మందలు అపారంగా ఉన్నాయి కాకసను పరగణా పంటలతో తులతూగుతూఉంది అటువంటి రత్నగర్భ, అటువంటి పాడిపంటల మహాలక్ష్మి, అటువంటి కామధేనువు రష్యాకు లేకుండా జర్మనీకి వశం అయినట్లయితే, రష్యాకు కలిగే నష్టము చాలా ఎక్కువైనదే అందువల్లనే స్టాలినుగ్రాడువద్ద నెల రోజులనుంచిన్నీ రష్యనులు హోరాహోరిగా భల్లూకపు పట్టుతో యుద్ధం చేస్తున్నారు జర్మను సేనలుకూడా సర్వశక్తులను ధారపోసి, తమ రక్తమును ప్రాణమును ధారపోసి, స్టాలినుగ్రాడు నగరంలో ప్రవేశించుటకు ఒక్కొక్క అడుగు ముందుకుసాగుచున్నారు ఒక్కొక్క రోజున అనేకవేలమంది జర్మను సైనికులు ఆ యుద్ధరంగంలో ఆహుతి అయిపోతున్నారు. స్టాలిమగ్రాడు నగర పశ్చిమ భాగంలో మాత్రం ఒక్క రోజున రణరంగములో ఆరువేల జర్మను సైనికులు హతులైనారు నగర దక్షిణభాగంలో కూడా యుద్ధం అతి తీవ్రంగా జరుగుతూఉన్నది అక్కడ ఇంకా ఎంతమంది ప్రతిరోజూ ప్రాణాలు విడుస్తున్నారో లెక్కలేదు జర్మనుల తాలూకు టాంకులు అనగా ఫిరంగి మోటార్లు విపరీతంగా ధ్వంసమైపోతున్నాయి. జర్మను సేనలకు ఇటువంటి అపారనష్టం కలుగుతూ ఉంటే, స్టాలినుగ్రాడులో ప్రవేశించుటకు జర్మనులు ఒక్కొక్క రోజుకు ఒక్కొక్క అడుగు ముందుకు పోగల్గుతున్నారు అపారమైన యీ జర్మను సైన్యనష్టం తలుచుకుంటే హిట్లరుకుకూడా గుండెలలో రాయిపడినట్లుగా ఉంది. ఆ యుద్ధరంగంలో ఇంత జర్మనుసేన నష్టమైపోతే, ఇంకా ముమ్ముందు జరగవలసిన యుద్ధం అగాధంగా ఉంటే, చిట్టచివరకు తగినంత అంగబలం జర్మనీకి లేని కారణంవల్ల, బ్రిటిష్‌వారి అమెరికావారి అపారమైన అక్షయ సైనికబలానికి ఎదురు జవాబుచెప్ప లేక, ఆఖరుకు జర్మనీ ఓడిపోవచ్చు. ఆయుధ బలం ఎంత సమృద్ధిగా ఉన్నప్పటికీ, దానితో బాటు అంగబలంకూడా ఉండాలి సమృద్ధిగా సైనికులుకూడా ఉండాలి

రష్యాతో జర్మనీ యుద్ధం ప్రారంభించి సంవత్సరం దాటింది కాని, యింతవరకూ జర్మనీకి లభించిన దేమిటయ్యా అంటే, రష్యాలోని ఒకటి రెండు పరగణాలుమాత్రమే ఇంకా రష్యా రాజ్యం అపారంగా విస్తరించి ఉంది ఇటు యూరోపుఖండంలో నుంచి అటు ఆసియాఖండంలోకూడా రష్యా రాజ్యం వ్యాపించి ఉంది. రష్యాకుగల విస్తారమైన సైన్యం జర్మనీకి లేదు రష్యను ప్రజల మొండిపట్టుదల, భల్లూకపు పట్టువంటిది. రష్యా యొక్క ప్రభుత్వతంత్రము యావత్తూ నడిపించుచున్న స్టాలిను ఉక్కుముక్కవంటివాడు. రష్యాలోని యూరల్ పర్వతాలవద్ద ఇంకా అనేకమైన లోహపు గనులు, కిరసనాయిలు గనులు తయారుగా ఉన్నాయి రష్యా ప్రభుత్వం అక్కడ తిరిగి అనేక యంత్రాలయాలు ఏర్పాటుచేసింది. ఆ ప్రాంతాలలోనే అనేక కొత్త భూములు విస్తారంగా సాగుచేయబడి పంటలు పండింపబడుచున్నవి. ఈ విధంగా రష్యా ప్రభుత్వం కొత్త ఖనిజసంపదతో, కొత్త పంటభూములతో, కొత్త యంత్రాలయములతో, కొత్త సన్నాహములుచేసి, కొత్త యుద్ధరంగాలలో జర్మను సేనల అంతు తెలిసికోవలెనని తయారవుతూ ఉన్నది కనుక రష్యా నిద్రపోదు రష్యాతో యుద్ధం యీ యుగంలో పూర్తి అయ్యేదికాదు కాకసను పరగణా పోయినప్పటికీ రష్యావారు కత్తి కిందపెట్టి హిట్లరుకు సలాము చెయ్యరు. ఈ సంగతి హిట్లరుకుకూడా పూర్తిగా తెలియును అందువల్లనే, రానున్న శీతకాలంలో జర్మనుసేనలు రష్యాలోని విపరీతమైన చలికి నిలువలేక, ఆ చలికి బలియై తోక మడతపెట్టి పారిపోయి రాకుండా, రష్యాలోచేరిన జర్మను సైన్యాలకు కావలసిన సౌకర్యాలున్నూ,

బందోబస్తులున్నూ హిట్లరు చేస్తున్నాడు ఇంకో సంవత్సరంకూడా, ఇంకా కొన్ని సంవత్సరాలు కూడా, రష్యాతో హిట్లరు యుద్ధం చేస్తూ ఉండ వలసివస్తుంది ఇటువంటి శీతబుతువులు ఎన్ని ఇంకా గడపవలెనో హిట్లరుకు లెక్క తెలియడం లేదు. ఎన్ని చలికాలములు దాటితే, రష్యా తనకు వశం కాగలదో తెలియడంలేదు ఎన్ని శీతకాలములు దాటినా, జర్మను సేనలు యీప్రకారంగా రష్యాలో ఆహుతి కావలసినదేనా? జర్మనుసేన ఎంతకాలం ఈ ప్రకారంగా ఆహుతి కాగలదు? జర్మనుసేన అక్షయంగా పెరుగుతూ ఉండగలదా? ఈ విధమైన ఆత్మవిచారణ చేసికో వలసిన సమయం హిట్లరుకు వచ్చింది

ఒక్క స్టాలినుగ్రాడు యుద్ధంలో, అపారమైన జర్మనుసేన నష్టమైపోతూఉంటే, హిట్లరు చూచి సహించలేక పోయినాడు అక్కడ ఆ యుద్ధరంగంలో సేనాధిపత్యం వహించిన జర్మను సేనానియగు వాన్‌బాక్‌ను రమ్మని పిలిపించాడు. అతడు జర్మను సేనను విపరీతంగా నష్టపరచుచున్నాడనే కారణంచేత, అతని బదులుగా, వాన్ కేపెలును ఆ యుద్ధరంగంలో జర్మను సైన్యాధిపత్యం వహించుటకు పంపించినాడు జర్మను సేన క్షీణించిపోతూ ఉన్నదనే మనోవిచారం హిట్లరుకు ప్రారంభమైనది

చేయరాని పని

ఇదివరలో కెయిజరు చక్రవర్తి జర్మనీని పరిపాలించినప్పుడు గడచిన అయిరోపా సంగ్రామం సాగించాడు అతడు చాలాదూరం ఆలోచించాడు ఏ రాజ్యంతోనైనప్పటికీ యుద్ధమునకు దిగవచ్చునుగాని, బ్రహ్మాండమైన రష్యా రాజ్యంతో యుద్ధమునకు దిగకూడదని గ్రహించాడు. కాని, రష్యాతో సమరం విధిలేక చెయ్యవలసి వచ్చింది కాని కెయిజరు చక్రవర్తికి పూర్వము ఉన్న బిస్మార్కు మాత్రము "రష్యాతో జర్మనీ ఎన్నటికిన్నీ యుద్ధము తలపెట్టకూడదు" అని ఖండితంగా చెప్పుతూ ఉండేవాడు ఆ బిస్మార్కు ప్రభువుయొక్క మునిమనుమడైన కవుంటు బీసురిక్కు వాన్‌ఈన్ జీగెలు యిటీవల యీ రష్యా యుద్ధరంగంలోనే రష్యనులకు యుద్ధ ఖైదీగా పట్టువడినాడు జర్మను పటాలములలో ఇతడొక పెద్ద సైనికోద్యోగిగా పనిచేస్తున్నాడు. ఇతనిని రష్యను సైనికులు యుద్ధ ఖైదీగా పట్టుకొన్నతర్వాత, రష్యను సైనికులతో ఇతడు చెప్పినమాట ఏమిటంటే, "రష్యామీదకు జర్మనీ దండెత్తకూడదని నా ముత్తాతయైన బిస్మార్కు చెప్పుతూ ఉండేవాడు ఆయన చెప్పిన ఉపదేశం చాలా దివ్యమైనది" అని అన్నాడు కాని, హిట్లరుకుగల అహంకారంవల్ల అటువంటి దూరదృష్టిగల సదుపదేశం చెవికెక్కదు. నాజీ పార్టీ నాయకుడైన హిట్లరుకు తన నాజీ ప్రభుత్వబలము అజేయమైనదనే గర్వం పూర్తిగాఉంది తన ప్లాను ప్రకారం జరిగితే, తన నాజీబలం సమస్త లోకమును సర్వనాశనం చేయగలదనే అహంకారంతో హిట్లరు యీ సంగ్రామం ప్రారంభించాడు కాని, యీ స్టాలినుగ్రాడు యుద్ధంలో తన జర్మనుసేన అపారంగా క్షీణించిపోవడం చూచి జ్ఞాన నేత్రములు కొంచెంగా తెరచినాడని తోచుచున్నది. నార్వే యువకులుకూడా రష్యను యుద్ధరంగంలోకి తనకు కావలెనని నార్వేలో తన ఆజ్ఞకు లోబడి అధికారం వహించిన క్విస్లింగును హిట్లరు కోరియున్నాడు రష్యా యుద్ధరంగంలోనికి తన జర్మనుసేనలు చాలకపోవుటవల్లనే, రుమేనియా సేనలను, ఇటాలియను సేనలను, హంగరీ సేనలను తీసికొనివచ్చి యుద్ధం చేస్తున్నాడు. మొన్న నొక రుమేనియను పటాలము రష్యనుల ధాటికి నిలువలేక, పిక్కబలము చూపించి, వెనుకకు పారిపోతూ ఉంటే, జర్మను సైనికాధికారులు చూచారు తమ పక్షమున నిలువబడి పోరాడవలసిన యీ రుమేనియను సైనికులు తమకు ద్రోహంచేసి పారిపోతున్నారనే కారణంచేత, ఆ రుమేనియను సైనికులమీద జర్మను సైనికులే తుపాకులు కాల్చి వారిని చంపివేశారు ఈ విధంగా, హిట్లరు తన ఆక్రమణలోనికి వచ్చిన రాజ్యాలలోని ప్రజలను నిర్బంధించి తన పక్షమున యుద్ధంచేయుటకు తీసికొనివచ్చినప్పటికీ అటువంటి సైన్యాలు తనకు అక్కరకు రావనికూడా గ్రహించక తప్పదు తాను అక్రమముగా క్రూరంగా దండెత్తి నిన్నమొన్న జయించిన రాజ్యాలలోని ప్రజలకు తనమీదను జర్మనీ యెడలను పూర్తిగా ద్వేషం ఉంటుంది అటువంటి రాజ్యాల సైనికులను బలవంత బ్రాహ్మణార్థంగా తన జర్మను సేనలతోచేర్చి యుద్ధరంగానికి తీసికొనివస్తే ప్రయోజన మేమిటి? రష్యను యుద్ధరంగాలలో వారిని మేకపోతులవలె బలి యివ్వవలసి ఉంటుంది. తన జర్మను సేనలు రష్యను ఫిరంగులకున్నూ రష్యను సైన్యానికిన్నీ ఆహుతి అవుతూనే ఉన్నాయి.

(మిగతా 10 వ పేజీలో)

# యుద్ధ విమర్శ.

## రష్యా యుద్ధం - జర్మనీపై విమానదాడి - ఈజిప్టు యుద్ధ ప్రాముఖ్యత.

**రష్యా శత్రువుపై ఒత్తిడి**

స్టాలినుగ్రాడు నగరద్వారముల ఎదుట బ్రహ్మాండమగు యుద్ధం జరుగుచున్నది ఎర్ర సైన్యాలు వాల్గానదిని వెనుకుంచుకుని, నానాటికి హెచ్చుగుచున్న శత్రుసేనల నెదిరించుచు పోరాడుచున్నవి. శత్రువుకి ఏమాత్రం విజయం కలిగినా విశేషనష్టంతోనే కలుగుచున్నది జర్మను, రుమానియా ఇటలీ సైనికుల మరణ సంఖ్య 12,000 హెచ్చినది సోవియటు రక్షణ సైన్యం మూర్ఖపట్టుదలతో నిలచి పోరుచున్నది , ఒక సైనికుడు ఒక్క గుండుతోగాని చేతి బాంబుతోగాని మిగిలియున్నంతవరకు పోరు విడువరాదని రష్యా అధికారులు ఉత్తరువు చేసిరి. శత్రువుకి కలిగిన నష్టంగూర్చి బ్రిటిషు సైనిక విలేఖరి యిట్లు వ్రాసెను——

> " శత్రువు అనుకోనంత ఎక్కువ నష్టపోయెను , తనకు కావలసిన కనీస లాభముకన్న తక్కువ లాభమును పొందుచుండెను "

జర్మను సైన్యాధికారులు యింత నష్టం కలుగుతుందనుకోలేదు. కాని వానుబాకుగారు (జర్మను సేనాధిపతి) గత్యంతరంలేక ఎంత నష్టానికైన సిద్ధపడుచున్నారు. ఏదోరీతిగా యీ యుద్ధంలో ఫలితం తేలాలి. కార్కోవును వారు ఆదిని తీసుకొన్నప్పటినుండి, యీ ఫలితంకోసం ఎదురుచూస్తున్నారు రష్యా అంతటిని ఆక్రమించడానికి వీలులేదు కనుక, రష్యాలో తాము ఆక్రమించగలమనుకునే ప్రదేశానికి హద్దుగీచుకొని, అక్కడవరకు సులభంగా దాడిచేసి, అక్కడనుంచి రష్యనుల ఎదురు దాడులను ఎదుర్కొనుచుండాలని ; అంతవరకు ఆక్రమించిన రష్యా భాగంలో సంపదనంతా నిరాఘాటంగా దోచుకోవాలనీ జర్మను అధికారులు ఉద్దేశించిరి అని ఒక జర్మను సైనికోద్యోగి జూరిచి విలేఖరికి తెలిపెను అతడిట్లనెను .——

> " వోల్గానదికి వెనకవరకు రష్యనులు తమ సేనలను ఉపసంహరించుకొనినచో లాభముండదు సోవియటు సైనిక సంపదయంతయు నాశనం అయితేగాని, దేశాన్ని ఆక్రమించి రష్యా పరిశ్రమలను స్తంభింపచేసి తిరిగి సైనికసంపత్తి చేకూరకుండా చేస్తేగాని ; అమెరికానుండి అరువుకవులు పద్ధతిని సరకు రష్యాకు పెర్షియా, మార్మంస్కు, ఆర్చేంజలు మార్గాలను రాకుండా నిరోధిస్తేగాని, జర్మనుల కార్యం సఫలంకాదు "

రష్యనులను చావుదెబ్బకొట్టి, యితరుల సహాయం వారికి రాకుండా చేస్తేగాని, లేకుంటే శీతకాలంలో రష్యనులు తిరిగి కోలుకొని నిరటివలెనే తమపై తిరుగుదాడులు చేస్తారని ఆ జర్మను

---

## " అక్కడ ఉన్న వ్యక్తి చెప్పగా విన్నాను "

అక్కడ ఉన్నాడా ? నిశ్చయమేనా ?
లేనిపోని పుకారులను వ్యాపింపచేయవద్దు.
అవి నష్టం, అసౌఖ్యం, సంకోచం కలిగిస్తాయి.
అమాయకులగు ప్రజలు వాటిని
వ్యాపింపచేస్తారను నమ్మకంతో
శత్రువులే వాటిని ప్రారంభిస్తారు.

* పుకారులను నమ్మకండి. *



జపాన్ను ఎదుర్కొనుటకు
జాతీయ యుద్ధరంగం తయారుచేయుడు

---

ఉద్యోగికి భయంగావుంది. శీతకాలంలోకూడా యుద్ధం జరిగితే, జర్మను సైనికులంతా యీ యుద్ధరంగాలలో నుండిపోయి, జర్మనీ ఆయుధ పరిశ్రమలకు కావలసిన మనుష్యులుండరు.

రష్యను విమాన దాడి

రష్యా యుద్ధక్రమంలో ముఖ్యమయిన అంశం యిటీవల వారివిమానాలు తూర్పు ప్రష్యా, పోలండు, బెర్లిను నగరాలపై దాడిచేయుట జర్మను విమానశక్తియంతా తమపై బడుచుండగా ఎదుర్కొనుచుండుటేకాక, తీరికచేసుకొని జర్మనీపై దాడిచేయుటకుకూడ పూనుకొన్నారంటే, రష్యనుల సాహసముగూర్చి వేరే చెప్పనక్కరలేదు అతిదూరపు విమానదాడులుగూడ వారు చేయగలుస్తున్నారన్నమాట రష్యా విమానాలు బెర్లిను నగరంపై దాడిచేయుటకు 800 మైళ్లు, తూర్పు ప్రష్యాలో కోనిసుబర్గునకు 480 మైళ్లు, పోలండులో వార్సాకు 500 మైళ్లు పోవలసియున్నది ఆ దాడులు పడమటి జర్మనీపై బ్రిటిషు విమానాలు చేయునంత ముఖ్యమయిన దాడులు కాకపోవచ్చును అయినను పడమట రంగాల జరుగుచున్న పనికి బాగా తోడ్పడగలవు. కావున నిరిటివలెనే జర్మనీ కిపుడు యిరువైపులా అగ్గే కాని యీ అగ్గి యిదివరకుకన్న ఘోరమయినది ఇపుడు అమెరికా బాంబరులుకూడ దాడిలో పాల్గొనుచున్నందున, జర్మనుల మనస్సులందు కలవరము మరింత హెచ్చింది.

* * *

ఈజిప్టు యుద్ధ ప్రాముఖ్యత.

"ఆఫ్రికా పడమటి ఎడారియందు యిటీవల మనం రెండో విజయం బడసితిమి ఇచట పరిస్థితులగూర్చి నాకెట్టిసందేహంలేదు. సంపూర్ణ విశ్వాసం గలదు" అని వెండలు విల్కీగారు చెప్పిరి. వీరు అమెరికాలో ప్రతికూలపక్ష నాయకులు, యుద్ధరంగాలు చూచుటకు ప్రత్యేకంగా రూజువెల్టు అధ్యక్షునిచే పంపబడి, ఈజిప్టు చూచినపిమ్మట బాగ్దాదునగరం చేరినపిమ్మట పైవిధంగా అన్నారు. టొబ్రుకుపై సముద్రంలోనుండి నౌకల దాడియు, ఈజిప్టులోని ప్రస్తుత స్థితియు యీ విశ్వాసమును దృఢపరచినవి. మిత్రమండలి శక్తి వృద్ధియగుచున్నదనుటకు యివి నిదర్శనములు. సెప్టంబరు 13 వ తేదిన బ్రిటిషు నావికాదళం పైన విమానాల కాపలాతో టొబ్రుకుచేరువ దిగి, శత్రువులు ఎదిర్చి కొట్టుచుండగా లక్ష్యంచేయక దాడిసలిపి చాల నష్టపెట్టి తిరిగివచ్చినవి డాబా ప్రాంతములందు మరో చిన్న సైనికదళం దాడిచేసి శత్రు మార్గాలను నిరోధించెను ఈజిప్టుపైకి శత్రువు యిపుడు రాత్రివేగు విమానాలనుమాత్రం పంపగల్గుచున్నాడు. మన 8 వ సైన్యం ప్రస్తుతం ఎక్కడనుందో తెలునుకోలేకుండాయున్నాడు. విమానాలపైనుండి తీసిన ఫోటగ్రాఫులు మన సైన్య ఉనికిని చూపలేకపోయినవి. ఇంకోసారి యీరంగమున తీవ్ర సంఘటనం జరుగవచ్చును కాని, శత్రువుకి యిప్పటికే చాల నష్టం కలిగిందనుటకు యెట్టి సందేహం లేదు.

ఈజిప్టు రష్యాలను పోల్చిచూచిన ఈజిప్టు రెండోరకమ్మే, అయినా యుద్ధం మొత్తంపై చూచిన ఈజిప్టురంగంకూడ ప్రధానమయినదే యని లండను టైమ్సు పత్రిక వ్రాసెను, ఆ పత్రిక ఇంకను యిట్లు వ్రాసెను —

> "ఈజిప్టు రక్షణ బ్రిటిషు సామ్రాజ్యానికేగాక రష్యాకుగూడ చాల అవసరము ఎదిరిపక్షం దృష్టితో చూచినచో ఈజిప్టు యెక్కువ ప్రాముఖ్యమైనది నేటి ప్రపంచ యుద్ధమునందు సముద్ర రాదారి మార్గాలే ప్రథానావసరములు కనుక పురోగమన యుద్ధానికి ఈజిప్టు ముఖ్య కేంద్రంగా నుండగలదు ఫ్రాంసు అటుచేరడంవలనను, మధ్యధరాసముద్రమునందు శత్రు విమాన బల మధికమగుటచేతను ఈజిప్టు అర్హత కొంత తగ్గింది ఆ దుర్దశ కొంతేనా తొలగించినచో చాల యెక్కువ లాభముండును రష్యాకూడ తప్పక ఆ లాభం పంచుకోగలదు"

ఈజిప్టు యుద్ధరంగంలో యిరుపక్షాలవారును తిరిగి డీకొనుటకు తొందరగ తయారగుచున్నను ముందుదెబ్బ ఎదిటిపక్షంవారు కొట్టకుండ నిరోధించుటకు ఉభయులు ప్రయత్నించుచున్నారు. ఈజిప్టు పత్రికలు చర్చిలు ప్రకటనను కొనియాడుచున్నవి. యుద్ధనిర్వహణ బాధ్యతగలవారు పూర్తి విశ్వాసంతో అనుసరింపదగ్గ పెద్దలని చర్చిలుగారి ఉపన్యాసం రుజువుచేసిందంటున్నాయి కైరోలో ప్రధాన పత్రికయగు అల్‌బలాగు యిట్లు వ్రాసెను —"బ్రిటిషువారు సర్వదా అప్రమత్తులై శ్రద్ధగ కాపాడుచుందురని విశ్వసింపవచ్చును. అపుడపుడు వారిపైగల బ్రహ్మాండమగు బాధ్యతననుసరించి అచలనంగా నుండవలసివచ్చినను ఫరవాలేదు. మధ్యధరాసముద్రంలో రోమెలు

(మిగతా 10 వ పేజీలో)

# యుద్ధ చర్యలు - యుద్ధ పరిశ్రమలు - యుద్ధ సేవ - యుద్ధం భోగట్టాలు.

## కాగితం కరువగుటచే వాడుక తగ్గించుకొనుట.

రానున్న మాసములలో కాగితంవాడుక తగ్గించుకోక పోతే అవసరమైన పనులకుగూడ కాగితం చాలినంత ఉండకపోతుందేమో నని భయంగావుంది వైస్రాయి కార్యవర్గంచే నియమింపబడిన రిసోర్సెను ఉపసంఘంవారు కాగితం గిరాకీ సప్లయివిషయము విచారించి యీ నిర్ణయమునకు వచ్చిరి ప్రత్యేకవ్యక్తులు, ప్రైవేటు సంస్థలు, కంపెనీలు, ప్రభుత్వ కచేరీలు లోకలు బోర్డులు అన్నిగూడ కాగితం వాడుక తగ్గించుకోవాలని సదరు ఉపసంఘంవారు హెచ్చరించుచున్నారు.

అప్పుడే ప్రభుత్వకార్యాలయములందు వాడుక తగ్గించిరి యుద్ధసమయమునందు అవసరంలేని కొన్ని ప్రభుత్వ ప్రకటనలు ప్రచురించుట మానివేసిరి కొన్నింటిని మరీ సంగ్రహంగా ప్రకటించుచున్నారు స్టేషనరీ కోరేవారి కోర్కెలు అతిశ్రద్ధగ తణికీ చేయుచున్నారు రాష్ట్రప్రభుత్వాలనుగూడ యిటువంటి తగ్గించుకొనే యేర్పాటులు చేయమనికోరిరి కవరులకు 'ఎకానమీ లేబిల్సు' అని చిన్న కాగితంముక్కలు అంటించి, వాటనే చించి అంటించుచు, కవరులు పాడుచేయకుండా తిరిగి ఉపయోగించుట, చిన్న కాగితాలపై రెండువైపులా టైపుచేయుట, అనవసరిమైన వుత్తరాలు, మినిట్సు, జవాబులు వ్రాయకుండుట మున్నగు పద్ధతులు అపుడే అనుసరించబడినవి ప్రభుత్వోద్యోగులు, ప్రజలుకూడ శ్రద్ధగనుండి వాడుక తగ్గిస్తే ఇంగ్లాండులో అమలుజరిపినటువంటి కఠిన నియమాలు కాగితం వాడుకవిషయంలో యీదేశంలో అనుసరింకవలసియుండదని ప్రభుత్వంవారు యెంచుచున్నారు

*　　*　　*

## ఇండియాలో తయారయిన క్రొత్త నౌక.

### మందుగనులను తొలగించి జలాంతర్గాములను ముంచును

రాయలు ఇండియను నౌకాదళమునకుచెందిన క్రొత్త నౌక ఒకటి ఇటీవల యిండియా రేవులలో ప్రథమ ప్రయాణం సాగించెను అది మందుగనులను తొలగించి జలాంతర్గాములను ముంచుటకు వుపయోగించబడును.

మొట్టమొదట ఇండియాలో తిరువాంకూర అను నౌక కట్టబడెను తరువాత బరోడా అను నౌక కట్టబడెను ఈ రెండూ ప్రయాణాలు సాగించినపిమ్మట క్రమక్రమంగా ఎన్నో నిర్మింపబడి భారతీయరేవులను విడచుచున్నవి వాటిలో పెక్కింటికి భారతీయ సంస్థానముల పేర్లు, ముఖ్యనగరముల పేర్లు పెట్టబడుచున్నవి ఒకటి నీట దిగినతోడనే వేరొకదానికి నౌకానిర్మాణరేవులో అస్థిభారంవేయుచు, తెరపి లేకుండ పనిచేయుచున్నారు ఈరీతిగా కడుదీర్ఘమగు ఇండియా తీరమును రక్షించుటకును, సముద్ర వ్యాపారం సాగించుటకును ఆధునిక పరికరములన్నీ కలిగిన నౌకలు ఇండియాలో అంతకంతకు అధికంగా నిర్మింపబడుచున్నవి

ఆ నౌకలకు ఉద్యోగులు నావికులు తయారుచేయుటకు శిక్షణలయములు యెక్కువజేయబడుచున్నవి జలాంతర్గాములను వెంటాడి ముంచుట యీ క్రొత్తనౌకల ప్రధాన కర్తవ్యంగానుండును. కావున నావికులకు రేవుస్థలములలో రాయలు ఇండియను నౌకాదళ శిక్షణ కేంద్రములు పెంచబడినవి ఈ పాఠశాలయందు శిక్షణపొందుచున్న ఉద్యోగులు నావికుల సంఖ్య గత ఆరు మాసాలలో 2½ రెట్లు పెరిగింది అచట విచిత్రమగు యంత్రముల సహాయమున సముద్రములో జలాంతర్గాములవేటవంటి వేటయే చూపి వాటిని ఎట్లు ముంచడమో నేర్పుదురు

*　　*　　*

## ఇండియాలో స్త్రీల యుద్ధసేవ.

వుమన్సు వలంటిరీ సర్వీసు ఇంగ్లాండులో ఘనమగు సేవ చేసింది ఇండియాలోగూడ అట్టి స్త్రీల సేవాసంస్థ అతివడిగా విస్తరించుచున్నగి యుద్ధచర్యలందు సేవచేయ అవకాశం చిక్కేవరకు వేచియుండక ప్రస్తుత అవసరమునకు తగిన సేవచేయదలచిన స్త్రీలకొరకు యీ సంస్థ ఉద్దేశింపబడినది స్త్రీలు యుద్ధమునందు ఏయేరీతిని సేవచేయగలరో తెలుపుటకు అవసరమగు సమాచారమంతయు డబ్ల్యు వి ఎస్. వద్ద నుండును గుమస్తాపని, ఉపన్యాసాలిచ్చుట, విమానదాడిరక్షణకార్యాలు, రక్తం జాగ్రత్తచేయుట, ఎయిరు డిఫెన్సుకోరు, మున్నగుపనులు వేనికి ఏ స్త్రీ బాగుగ పనికివచ్చునో చూచి ఎంచి అందుచేరుటకు తగిన సహాయం యీ సర్వీసులోనివారు చేయుదురు రిక్షణార్థులై దేశాలు విడచి వచ్చినవారికి యుద్ధసేవయందున్నవారి కుటుంబాలకుగూడ వీరు సహాయం చేయుదురు

"మీ రిపుడు ఇండియాకు అవసరం" అని వుమన్సు వాలంటరీ సర్వీసు సంస్థయొక్క ఆదర్శవాక్యం వివరాలన్ని ప్రధాన కార్యదర్శి, హెడుక్వార్టర్సు, డబ్ల్యు వి ఎస్, సిమ్లా అని వ్రాస్తే తెలుస్తాయి.

*　　*　　*

## సెర్చిలైటు సైనికులు బాంబుల నెదిరించి విమానం పడగొట్టుట

సెర్చిలైటు దళంవారి పని శత్రువిమానాలపై కాంతివంతమగు దీపాలు ప్రసరింపజేసి, వాటిని బయల్పెట్టుటమాత్రమే భారతీయ సెర్చిలైటుదళంవారు యీ మాత్ర పనితో సంతృప్తిచెందక ఆఫ్రికా ప్రాంతములందు ఒక మరఫిరంగిని వశంచేసుకొని, దానితో జర్మను విమానాన్ని గురిచూచి కొట్టి కూలద్రోసిరి

సైన్యం వెంటానుండే విలేఖరికి సెర్చిలైటు దళం' ఉద్యోగిపై యుదంతం గురించి యిట్లా చెప్పేడు —

గత రాత్రంతా నిద్రలేక పనిచేసి, పగలంతా ప్రయాణం చేసి మాదళం సాయంకాలం సరికి ఒక క్రొత్త విమానాశ్రయంవద్ద చేరింది చీకటిపడేసరి దుర్భిణి దీపాలు సిద్ధంగానుంచుకొంటిమి అట్టే కాలంవేచియుండ నక్కరలేకపోయింది జర్మను విమానాలు కొన్ని గుంపుగా వచ్చి, మంటల బాంబులువేసి దిగువనున్న మా విమానాశ్రయమును గుర్తించి, బాంబులు వేయసాగినవి

దుర్భిణి దీపాలు ఒక విమానాన్ని తమ కిరణాలచే అగుపడునట్లు చేసినవి కాంతిలోనుండి తప్పించుకో పోవుటకై ఆ విమానం యింకో దీపానికి కొద్ది అడుగులమీదుగా పోయెను ఆ దీపాన్నుపయోగించేవారు ప్రక్కనున్న మరఫిరం

గితో విమానంపై ప్రేల్చిరి ఆ విమానం—జూ 88—వరుసగ నుండు దెబ్బలుతిని పడిపోయేసరికి వారి ఆనందం ఏమనిచెప్పను!

అంతట యితర విమానాల నడుపువారు భయపడి, యింక విమానాశ్రయంపై దాడిచేయక పారిపోయి, 8 మైళ్ల దూరంలో తమ బాంబులు నిరపాయకరంగ పడవైచిరి

* * *

## ఇండియాలో గాలిగుమ్మటాలు తయారుచేయుట.

విమానాలనుండి సైనికులు దిగుటకు గాలిగుమ్మటాలు (పారాషూట్సు) ఇండియాలోనే తయారుచేయించుటకు ఇండియా ప్రభుత్వంవారు ప్రత్యేకంగా ఒక కర్మాగారం తయారుచేసిరి అందుచే పారాట్రూప్సు (సైనికులను) తయారుచేయుటకు ఎక్కువ సుకరమయింది సిరుడీ పని గూర్చి ఇండియాలో తలపెట్టలేదు ఈ సాలారంభమునందే కర్మాగారం స్థాపించుటకు చురుకుగ పని ప్రారంభమయింది

రాయలు విమానదళవారు ఉపయోగించు పారాషూటును కనిపెట్టిన లెస్లి ఇర్వినుగారు ఇండియాకువచ్చి యీ కర్మాగారం స్థాపన కార్యమంతా స్వయంగా తనిఖీచేసిరి వారు వచ్చేక పని అతివడిగా జరిగినందున, కొద్ది నెలలలోనే ప్రథమ గాలిగుమ్మటం పరిశోధనకై ఫ్యాక్టరీ విడిచింది నేడు అవి అతివడిగా తయారగుతున్నాయి

ఈ గాలిగుమ్మటాలు ఉపయోగించుటకుముందు చాల శ్రద్ధగ పరిశోధింపబడతాయి ఒక గూర్ఖా పారా సైనికుడు సాధారణంగా 120 పౌనుల బరువుంటాడు వానికి తోడు వాని తుపాకి మున్నగు సరంజామా వెంటనుండును కాని యీ గాలిగుమ్మటాలు యింతకు మూడింతల బరువుతో మొదటిసారి గాలిలో విడచి పరిశోధింపబడుచుండును

ఇండియాలో తయారయిన గాలిగుమ్మటాలు అతి ప్రశస్తమయినవని, అది తెగడంగాని చిరగడంగాని ఎన్నడు జరుగదని 20 సంవత్సరముల అనుభవంగల నిపుణులు చూసి చెప్పేరు

గాలిగుమ్మటాల పైకప్పుకి అవసరమగు పట్టుగుడ్డ మంచిది ఇండియాలో గలదు- పట్టు ఉత్పత్తి యెక్కువచేయుటకై మల్బరీతోటలు ఎక్కువగా నాటుచున్నారు

పారాషూట్సు తయారుచేయుటకు ఇండియా-ఇంగ్లాండుపై ఏ వస్తువు కొరకు ఆధారపడనవసరంలేదు మందు కవసరమగునవన్ని ఇండియాలోనే గలవు.

పారా సైనికుల కవసరమగు సంచులు, ఆయుధాలు మందుగుండు కప్పులు, మడత బల్లలు, మడత స్ట్రెచరులు, ఆహారం పడేయడానికి సంచులుగూడా ఇండియాలో తయారగుచున్నవి

[ 6 వ పేజి తరువాయి ]

హిట్లరుయొక్క నాజీ బలంతో, హిట్లరు యీ విధంగా, ఋష్యాశ్రమంలో మహా యజ్ఞం చేసినట్లుగా రుష్యాలో మహా సమర సవనం చేస్తున్నాడు. ఈ సవనంలో తన నాజీ బలమునే బలిగా సమర్పిస్తున్నాడు. యజ్ఞంచేసిన సోమయాజీకి స్వర్గపదవి లభిస్తుందని అంటారు. రంభతో సౌఖ్యంకూడా అనుభవిస్తాడని అంటారు రుష్యా రంగంలో యీ సమర సవనం చేసేటటువంటి యీ నాజీ సోమయాజీకి స్వర్గమార్గం లభించకపోయినా, జ్ఞానమార్గం అయినా లభించవచ్చు. తన నాజీ బలాన్ని బలియిస్తేనేగాని, ఆ హిట్లరు అహంకారం ఆహుతికాదు అహంకారం ఆహుతి అయితేనేగాని, అతడు తలపెట్టిన ఆత్మయజ్ఞం పూర్తికాదు నాజీ బలం నాశనంకావాలి. నాజీ యజ్ఞం పూర్తికావాలి నాజీ ప్రభుత్వం పోవాలి. మిత్రమండలి కోరేది ఇదే నాజీలు పోతే ఇక లోకంలో "న ఆజి" అని గ్రహించాలి "ఆజి" అంటే యుద్ధం "—న" అంటే లేదు. నాజి యజ్ఞం అయినతర్వాత లోకంలో నిజమైన "నాజి" అనేమాట స్థిరమై, యుద్ధమనేది లేకుండా శాంతి ఏర్పడుతుంది

[ 8 వ పేజి తరువాయి ]

సేనలకు వచ్చుచున్న సప్లయి నౌకలను అడ్డుచు వెంటాడుచున్న బ్రిటిషు సబుమెరైనుల చర్యల వివరములను దెల్పుచు ఆ పత్రిక "రోమెలు సేనల రెక్కలు కత్తిరించుటకు ఖచితమయిన మార్గం యిదే కనుక తప్పక యీ చర్యలు కొనసాగును." అని వ్రాసింది.

**చలికాలంలో ఫలితం తేలదు**

స్టాలినుగ్రాడు నగరాన్ని జర్మనులు ముట్టడి చేయడంగూర్చి రాయటరు విలేఖరి వ్రాయుచు, యిదివరకున్న చాల ప్రమాదకరమగు పరిస్థితు లేర్పడినవనియు, జర్మనులకు విశేష నష్టంకలిగినందున కొన్ని రోజులలో దాడి నిలిపేస్తారు, లేదా ఆ నగరం దీర్ఘకాలం శత్రు దాడికిలోనై కష్టపడుతుందని మాస్కో నగరంలో అనుకుంటున్నారనెను. అనేకసారులు యిదివరకిట్టి "క్లిష్ట పరిస్థితు" లేర్పడినందునను, రష్యనులు వాని దాట గల్గినందునను, తిరిగి శీతకాలం వచ్చులోగా జర్మనులు విజయం పొందలేరని రష్యనులు ధైర్యంగానున్నారు. రష్యనులు క్రొత్త సేనల సహాయం తెచ్చుకోగల్గిరి. జర్మనులు యీ స్టాలిను గ్రాడు యుద్ధంగూర్చి ప్రకటించడంలో యిదివరకువలె త్వరలో పడుతుందని చెప్పడం మాని రష్యనులు క్రొత్త సహాయం బడయగల్గుటకు ఆశ్చర్యం వెలిబుచ్చుచున్నారు. స్టాలినుగ్రాడు పడిపోయినచో గొప్ప నష్టమే. అందలి పరిశ్రమలు యిదివరకే మార్చబడినందున అవి పోతాయనిగాదు, వాల్గానది మీదుగ రవానా సౌకర్యాలకు నిరోధం యేర్పడునని దీని పతనమొక నష్టంగా ఎంచబడుచున్నది.

కాని వోల్గానది చలికాలంలో మంచుతో గడ్డకట్టి పోవును. కనుక, చలికాలం వచ్చేవరకు యీ నగరం పడిపోకుండావుంటే చాలును ఎట్లయినా రష్యా సేనలు చలికాలం వచ్చేవరకు నిలచి యుండగలవు, హిట్లరు యింకో చలికాల్లము రష్యాలో సహించక తప్పదు అందుచే 1943 వ సం॥లో యినుమడించిన రష్యా శక్తిని ఎదిరించక తప్పదు

కాకసను ప్రాంతములో అక్టోబరు మధ్య భాగంలోను చలికాలం ప్రారంభమగును. పడమట రష్యాలో అదే సమయమున వర్షాలు ప్రారంభమగును. నవంబరులో పొగమంచు ప్రారంభమగును ; నవంబరు 25 సరికి పూర్తిగ మంచు గడ్డకట్టును. రష్యాలో తూర్పునకు, పోయిన కొలది చలిబాధ అధికమగుచుండును. ఉత్తరాన సముద్రం చేరువగుటచే చలి అంతగా నుండదు. సైబేరియా వైపునుండి చలిగాలులు వచ్చుచుండును.

* * *

మడగాస్కరు తీసుకోవలసిన అవసరం

మడగాస్కరు దీవియందు మిత్రమండలి సేనలు, జయప్రదంగా దాడి జరుపుటచేత విషీ గవర్నరు జనరలు అన్నెటుగారు తమ సేనలచే యుద్ధం మానిపించి రాజీకి దిగునున్నారు. ఫ్రెంచి సేనలు మిత్రమండలి సేనల కట్టే నిరోధం కలిగించలేదు, వారి ఉద్యోగులు బ్రిటిషు సైనికులతోకలసి సంప్రదించిరి. మడగాస్కరులోనికి జపాను విమానాలను విషీప్రభుత్వంవారు రానిచ్చుచున్నారు ఆ దీవినుండి జపాను జలాంతర్గాములకు సప్లయిలు అందుచున్నవి. అది సంయుక్త రాజ్యాలకు చాల ప్రమాదంగానుండును ఇంగ్లాండు, సంయుక్త రాజ్యాలనుండి ఆఫ్రికా ఖండంచుట్టివచ్చు నౌకా మార్గానికి అడ్డుగా మడగాస్కరు దీవి గలదు ఈ దీవియందు శత్రువు కాలూని నిలచిన, ఈజిప్టు ఆఫ్రికాలకును, పెర్షియాద్వారా రష్యాకును, ఇండియాకును సముద్రమార్గం నిరోధించబడును. ఈ దీవియందున్న విమానాశ్రయాలను శత్రు విమానా లుపయోగించు కొంటాయి, శత్రు నౌకాదళం హిందూ మహాసముద్రంలోకి మన స్టీమరులు పోకుండా అడ్డగల్గును, ఉత్తర ఆఫ్రికాకు మార్గనిరోధం కల్గినచో, యింకో మార్గంలేక, సూయజు కాల్వ మధ్య ప్రాచ్య భాగములకు జర్మనుల దాడిని నిరోధించే అవకాశం పోతుంది. రష్యాకు ఒక మార్గం బందై పోవును ; పెర్షియనుగల్ఫు చేరువనున్న చమురుగనులు దూరమగును , చివరకు దక్షిణాఫ్రికాకే ముప్పుకల్గును. ఇన్ని కష్టాలుండబట్టి సంయుక్త రాజ్యాలు యీ మడగాస్కరు శత్రువశం కాకుండా చేయుటకై తమ సేనలను దింపినవి ఆ దేశాన్ని ఆక్రమించే ఉద్దేశం వారికెంతమాత్రం లేదు యుద్ధానంతరంగాని, అంతకుముందే ఆ దీవి తమ కనవసరమని తోచినపుడుగాని దాన్ని తిరిగి ఫ్రాంసుకి యిచ్చివేస్తారు.

* * *

ఇండియాగూర్చి చర్చిలు ప్రసంగం

చర్చిలుగారు ఇండియానుగూర్చి చెప్పినదాని యంతలో ముఖ్యమయినది, క్రిప్సుగారి సూచనలను పునరుద్ధరించుటయే. క్రిప్సు ప్రకటన బ్రిటిషు పార్లమెంటు అధికారుల ఆఖరు మాటగా నెంచవచ్చునని చర్చిలుగారు స్పష్టపరచిరి దీనితో అదివరకు కొందరికి అక్షరాజ్యాల ప్రచారంవలన కలిగిన సందేహాలు పోవచ్చును.

గాంధి మున్నగు కాంగ్రెసు నాయకులు చాల సౌఖ్యప్రదమగు సదుపాయములు కలిగిన నిర్బంధంలో నున్నారని చర్చిలుగారు దెలిపిరి. గాంధిగారొక ప్రైవేటు మందిరంలో భార్య బంధుమిత్ర సమేతంగా నుంచబడిరనియు, స్వంత డాక్టరు కూడ వారిచెంత నుందనియు, వలయు భోజన పదార్థములు యితర సౌకర్యము లొసంగబడుచున్నవనియు ఆగస్టు 30 తేదిన ప్రభుత్వంవారు ప్రకటించియుండిరి. ఐ. ఎం. ఎస్, ఉద్యోగి యొకడు వారికి చికిత్సచేయ నున్నాడు.

నాయకులందరు ఆరోగ్యంగా నున్నారు, వారి కుటుంబాలకు స్వంత విషయాలు ఉత్తరం వ్రాసుకొన అవకాశంగలదు, వార్తా పత్రికలు ఒసంగబడుచున్నవి.

భారతీయ సేనలను చర్చిలుగారు కొనియాడిరి. ఇండియాలో యింతవరకు నిర్బంధంగా సైన్యంలో చేర్చుకొనుట జరుగలేదు. 10 లక్షల భారతీయులకు పైగా సైన్యంలో ఐచ్ఛికంగా చేరిరి గత రెండు నెలలలో 140,000 మందికి పైగా చేరిరి. కనుక ఒక రాజకీయపక్షం సంయుక్త రాజ్యాల యుద్ధానికి తోడ్పడక పోయినంత మాత్రాన దేశంలో కొరతరాలేదని, యిందువలన తెలియగలదు.

## మద్రాసు పటాలములలో జనహాని

వేర్వేరు తేదీలయందు మద్రాసు పటాలములలో యీ క్రింది రీతిగా జనహాని కలిగినదని తెలియజేయుటకు చింతిల్లుచున్నాము:—

| నెంబరు | హోదా. | పేరు. |
|---|---|---|
| | **చనిపోయినవారు.** | |
| ఐ యస్ సి — | | |
| 17887 | సిగ్నలరు | టి ఎం ఘోషి. |
| ఎ/7822 | సిగ్నలరు | కందసామి |
| 55328 | సిగ్నలరు | ఫకీరు మీరను |
| ఐ హెచ్ సి — | | |
| 210007 | సిపాయి | శాళి |
| 88254 | సిపాయి | ఎం రామను |
| ఐ ఎస్ సి — | | |
| ఎ/3884 | యు ఎల్ నాయక. | మాధవారియరు. |
| ఎ/5249 | సిగ్నలరు | టి సాధనాదను |
| ఎ/5085 | పి ఎల్. నాయకు | వెంకటస్వామి |
| | **గాయపడినవారు** | |
| | ఆర్టిలరీ పయనరు. | |
| కోరు | | |
| 189306 | కార్మికుడు | అయ్యాప్పను |
| 189305 | కార్మికుడు | కె కరప్పను |
| 189450 | కార్మికుడు | శంకున్నినాయరు |
| ఐ ఎస్ సి — | | |
| 05119 | కె/వెయిటరు | ఆరోగ్యస్వామి |
| 26130 | సిగ్నలరు | ఎస్ కృష్ణస్వామి |
| ఆర్.ఐ ఏ.యస్ సి.— | | |
| ఎం.టి 948960 | సిపాయి | పి గురునాథం |
| ఐ ఎ ఒ సి.— | | |
| ఒ/121185 | హవల్దారు గుమస్తా | ఎం దాసను, |

**అగుపడక యుద్ధ ఖైదీలుగనున్నట్లు ఎంచబడినవారు.**

| నెంబరు | హోదా | పేరు |
|---|---|---|
| మదరాసు సేపర్లు, మైనర్లు— | | |
| 19097 | సేపరు | అక్బరాలి |
| 60951 | సేపరు | అల్లాబక్షు. |
| 19537 | సేపరు | అంతోని |
| 60137 | లా/నా | అంతోని సవారాయి. |
| 60995 | సేపరు | అప్పలస్వామి |
| 61285 | సేపరు | అప్పాసామి |
| 18655 | సేపరు | అప్పాళు పిళ్లె |
| 19103 | సేపరు | ఆర్ముగం |
| 19928 | సేపరు | ఆర్ముగం |
| 14112 | హవల్దార్ | బాలగురుస్వామి నాయుడు |
| 19937 | సేపరు | బాలకృష్ణన్. |
| 13968 | సేపరు | బంగారు. |
| 62322 | సేపరు | బాషా. |
| 19921 | సేపరు | బాషా |
| 62247 | సేపరు | చిన్న అప్పడు |
| 60970 | సేపరు | చిన్నకొలందై |
| 19090 | సేపరు | చిన్నప్ప |
| 63542 | సేపరు | చిన్నప్పను |
| 60626 | సేపరు | చిన్నస్వామి |
| 2016 | వంట | చిన్నస్వామి |
| 60914 | సేపరు | దాను |
| 60967 | సేపరు | దేవదానం |
| 60983 | సేపరు | ధనపాలు. |
| 12712 | సేపరు | ధనరాజు. |
| 1849 | వంట | దొరైస్వామి |
| 60907 | సేపరు | దురైస్వామి |
| 62397 | సేపరు | గణపతి |
| 1644 | వంట | గన్నిరాజు |
| 19100 | సేపరు | గోపాలు |
| 60986 | సేపరు | గోవిందను, |
| 62395 | సేపరు | గోవిందను. |
| 60442 | సేపరు | గోవిందరాజు |
| 60888 | సేపరు | జాకోబు. |
| 62420 | నాయకు | జగరాజు. |
| 16781 | హవల్దార్ | జిల్లె పీటరు |
| 62349 | సేపరు | కరుప్పసామి |
| 60401 | సేపరు | కోటయ్య |
| 60184 | సేపరు | కృష్ణను |
| 16181 | నాయకు | కృష్ణను |
| 16715 | లా/నా | కృష్ణస్వామి |
| 60203 | సేపరు | కుక్కల రెడ్డి |
| 19948 | సేపరు | కుంజం పిళ్లె |
| 1599 | బి మేకరు | కుప్పియ్య. |
| 18979 | సేపరు | కుప్పుసామి |
| 60962 | సేపరు | కుప్పుస్వామి కోనార్ |
| 1651 | ఎం. వంట | మధురై |
| 12844 | నాయకు | మదురముత్తు. |
| 60965 | సేపరు | మాన్యాలు. |
| 60153 | సేపరు | మానిక్యం ఉరఫ్ తెయ్యను |
| 60183 | సేపరు | మరగత పాండ్యను |
| 60894 | సేపరు | మరియప్ప చెట్టి. |
| 19003 | సేపరు | మార్కండను |
| 60134 | సేపరు | మట్టు ఎమానియల్. |
| 16645 | హవల్దార్ | మ అ రవూఫ్ |
| 17070 | సేపరు | మ. సలార్ ఖాన్ |
| 61264 | సేపరు | మునిసామి |
| 1562 | వంట | మునిసామి |
| 1834 | డబ్ల్యు/సి | మునిసామి. |
| 1598 | బి మేకరు | మునిసామి. |
| 60890 | సేపరు | నరశింహులు |
| 19922 | సేపరు | నరశింహను |

| నెంబరు. | హోదా | పేరు |
|---|---|---|
| 62346 | సేపరు ... | నారాయణ |
| 13136 | సేపరు | నారాయణస్వామి |
| 60196 | లా/నా | నరశింహ రెడ్డి |
| 16427 | హవల్దార్ .. | నరసయ్య |
| 17405 | సేపరు | నటరాజను |
| 15551 | సేపరు . | నటేశను |
| 19220 | లా/నా | పరశురామను |
| 60515 | సేపరు | పెరియసామి |
| 62370 | సేపరు | పెరుమాళు పిళ్లె |
| 19943 | సేపరు ... | పొన్నుసామి |
| 60631 | సేపరు | పొన్నుసామి |
| 62323 | సేపరు ... | పొన్నుసామి |
| 19764 | సేపరు | పూరసామి |
| 60142 | సేపరు ... | పుష్పనాథను |
| 19061 | సేపరు | రాఘవను . |
| 60978 | సేపరు | రాజగోపాలు. |
| 62305 | సేపరు | రాజు |
| 60928 | సేపరు . | రామచంద్రన్ |
| 60175 | సేపరు . | రామకృష్ణను |
| 62209 | సేపరు | రామకృష్ణను |
| 62207 | సేపరు | రామ రెడ్డి. |
| 60899 | సేపరు . | రాము. |
| 1693 | చాకలి | రంగస్వామి |
| 16534 | నాయక్ .. | రంగస్వామి. |
| 19059 | సేపరు | సంపంగి |
| 60909 | సేపరు .. | సంగీత రావు |
| 60876 | సేపరు .. | సంతప్పను |
| 18971 | సేపరు . | సన్యాసి. |
| 60537 | సేపరు . | సత్యనాథన్. |
| 17865 | లా/నా | షేకు అహమదు. |
| 16867 | హవల్దార్ | షేకు ఫకీరు. |
| 60918 | సేపరు | సౌరిముత్తు |
| 60190 | సేపరు .. | సుబ్బరాజు. |
| 62266 | సేపరు | సుబ్బయ్య |
| 1606 | వంటు . | సుబ్రహ్మణ్యం |
| 60938 | సేపరు . | స్వామికన్ను. |
| 19941 | సేపరు .. | తంగప్ప నాయరు. |
| 60171 | సేపరు | తిమ్మరాయను |
| 62337 | సేపరు ... | తిరున్నావుకరసు |
| 62520 | సేపరు .. | తామసు |
| 1568 | స్వీపరు . | టుక్ర. |
| 19924 | సేపరు ... | వేణు. |
| 65991 | సేపరు . | యల్లయ్య |
| ఐ హెచ్ సి — | | |
| 63117 | వంటు .. | ఆరోగ్యస్వామి |
| 188794 | ఎం వంటు ... | ఆరోకియసామి |
| హెచ్/85624 | ఎ సేపరు . | చిన్నకొలందై |
| హెచ్/90589 | ఎ సేపరు | చురమణి |
| 85622 | ఎ. సేపరు . | కన్నను. |
| 85618 | ఎ సేపరు | కొలందై. |
| హెచ్/85621 | ఎ సేపరు .. | కుట్టి పెరుమాళు. |
| హెచ్/93023 | ఎ. సేపరు | మల్లయ్య. |

| నెంబరు | హోదా. | పేరు. |
|---|---|---|
| ఐ.ఎ ఒ సి — | | |
| ఒ/109517 | ఎలక్ట్రిషన్ | డి అరుల్‌దాసు |
| ఒ/122800 | హ/గుమాస్తా | ఎన్. భాస్కరను |
| ఒ/71548 | సిపాయి డ్రైవరు | చిన్నదురై. |
| ఎంటి/500675 | ఫిట్టరు | దేవరాజు |
| ఒ/72634 | సి. డ్రైవరు | బి దేవదానం |
| ఒ/74559 | సి డ్రైవరు | ఎం దేవదాసు |
| ఒ/71202 | సి. డ్రైవరు | గోవిందస్వామి |
| ఒ/31811 | ఫిట్టరు | జి గోవిందు |
| ఎం టి/500936 | టర్నరు . | హనుమంతు. |
| ఎం టి/500953 | టర్నరు | లక్ష్మనదాసు |
| ఒ/75384 | సి డ్రైవరు | మార్గసగాయం |
| ఒ/70880 | సి డ్రైవరు | ఎం వి నాయుడు |
| ఒ/70903 | సి డ్రైవరు | ఎల్ ఎం పిళ్లె |
| ఒ/32441 | ఎలక్ట్రిషన్ | ఎన్ ఎన్ ఎస్ ప్రకాశం |
| ఒ/134194 | ఫిట్టరు | కె పున్యకోటి |
| ఒఎన్‌సి/1047 | లస్కారు .. | టి.కె. రామకృష్ణను |
| ఎంటి/504471 | ఫిట్టరు | రామయ్య. |
| ఒ/31820 | ఫిట్టరు | కె సత్యనారాయణ. |
| ఒ/31675 | పి. నాయకు . | ఎ శల్వరాజు |
| ఓ/123041 | హ. గుమస్తా | ఎం ఆర్. శ్రీనివాసను. |
| ఒ/122825 | హ గుమస్తా | సి వి. సుబ్రహ్మణ్యం |
| ఒ/71561 | సి. డ్రైవరు | తిరుమలనాయుడు |
| ఒ/71622 | సి డ్రైవరు . | వేలుచామి. |
| ఎంటి/504276 | ఎలక్ట్రిషను ... | అంతోని జేవియరు |
| హెచ్/90567 | ఎ సేపరు . | పద్మ. |
| హెచ్/40359 | ఎన్ సేపరు | సంతానం |
| హెచ్/85567 | ఎ సేపరు | ఎం సత్యనారాయణమూర్తి |
| ఐ యస్ సి — | | |
| 0/3833 | ఎస్. మేకరు .. | గోవిందసామి |
| ఎ/2755 | ఎఫ్/ఎ/నాయకు. | బాలకృష్ణనాయరు. |
| ఎ/5762 | సిగ్నలరు | ఎం. హరికృష్ణలు. |
| 15067 | సిగ్నలరు . | జయరాం నాయుడు |
| 03960 | ఐ టి సి ... | కుప్పుసామి |
| ఎ/5146 | సిగ్నలరు | కురుకొండ సుబ్బరావు. |
| 25047 | సిగ్నలరు . | వి కె. నారాయణ నాయరు |
| ఎ/5090 | సిగ్నలరు .. | పెరియసామి. |
| ఎ/3782 | సిగ్నలరు ... | రాజా |
| ఎ/6261 | సిగ్నలరు | శివనారాయణరాం |
| ఎ/2341 | సిగ్నలరు | కె విశ్వనాథ నాయరు. |

| నెంబరు. | హెూదా | పేరు. |
|---|---|---|
| ఆర్ ఐ.ఎ ఎస్ సి.— | | |
| ఎస్ ఆర్ / 776803 | లా/నా .. | చలపతినాయుడు |
| ఎస్ ఆర్ / 174542 | హ/గు | కె పి. కుమారను కట్టి నాయరు |
| ఇ టి/954326 | సిపాయి . | పి జీవరత్నం |
| ఎస్ ఆర్ / 776789 | లా/నా | కె వి సుబ్బన్న |
| ఎస్ ఆర్ / 765074 | లా/నా | పి వెంకటరంగం. |

వైస్రాయి కమిషను

| నెంబరు. | హెూదా | పేరు. |
|---|---|---|
| ఆర్ ఐ ఎ ఎస్ సి.— | | |
| ఎస్ ఆర్/ 120269 | జమేదారు గుమస్తా | టి.ఎస్ రామకృష్ణను |

ఇతర తరగతులు

| నెంబరు. | హెూదా | పేరు. |
|---|---|---|
| 10 వ బెలూచి రిజిమెంటు | | |
| 20134 | సిపాయి | జగన్నాదు. |
| 18477 | సిపాయి | శత్రుఘ్న |
| ఆర్ ఐ ఎ ఎస్ సి — | | |
| ఎఫ్/768153 | బిచ్చరు | అనుమప్ప |
| ఎస్.ఆర్ / 733376 | పి ఎ నాయకు. | పెరుమన రాఘవ కురప్ |
| ఎస్ ఆర్./ 776808 | పి ఎ నాయకు. | ఎల్. రంగరాము |
| ఐ జి.ఎస్.సి.— | | |
| జి ఎస్ ఎఫ్/1422 | వంట | బి టి అరుల్ దాను |
| జి ఎస్ ఎఫ్174 | స్వీపరు | బాబు |
| జి ఎస్ ఎఫ్/19122 | చాకలి | గంగయ్య |
| జి ఎస్ ఎఫ్/7077 | వంట | గోపయ్య |
| జి ఎస్.ఎఫ్/5373 | మసాల్జి | కన్నను |
| జి ఎస్ ఎఫ్/17529 | చాకలి | మానిక్యం. |
| జి ఎస్ ఎఫ్/5374 | మసాల్జి .. | పాపడే |
| జి ఎస్ ఎఫ్/14230 | కట్టువని | ఎ.కె. రాఘవను |
| జి ఎస్ ఎఫ్/17528 | చాకలి .. | రామస్వామి. |
| జి ఎస్ ఎఫ్/8098 | మసాల్జి | షణ్ముగం. |

అదివరకు తప్పిపోయి యిపుడు పనిలోచేరిన వారు.

| నెంబరు. | హెూదా | పేరు. |
|---|---|---|
| ఐ హెచ్.సి.— | | |
| 190809 | చాకలి .. | నారాయణ. |

కనపడనివారు

| నెంబరు. | హెూదా. | పేరు. |
|---|---|---|
| ఐ పి సి.— | | |
| 189237 | కార్మిక | జి ఆదయ్య |
| 189477 | కార్మిక | ఆండి |
| 189252 | కార్మిక . | పి అసరయ్య |
| 191295 | కార్మిక .. | చిన్న పయ్యన |
| 189403 | కార్మిక .. | చిన్నసామి |
| 191135 | కార్మిక | బి దావీదు |
| 191208 | కార్మిక | గోవిందను |
| 189243 | కార్మిక | కె కన్నయ్య |
| 189211 | కార్మిక | జి కోటయ్య |
| 189112 | కార్మిక | కుప్పను, |
| 189174 | కార్మిక | కె కుట్టను పిళ్లై |
| 189208 | కార్మిక | వై లచ్చయ్య |
| 191400 | వంట | మానిక్యం. |
| 191445 | కార్మిక . | వి నాగభూషణం |
| 189337 | కార్మిక | నందను. |
| 191322 | కార్మిక | పి కె నసూపిళ్లై |
| 191166 | కార్మిక | పరమశివను |
| 191297 | కార్మిక .. | పెరియసామి |
| 189187 | కార్మిక | పిచ్చకారను |
| 191428 | కార్మిక . | పిచ్చయ్య |
| 191440 | కార్మిక | పి పోతు రాజు |
| 189441 | కార్మిక | వి ప్రకాశం |
| 191124 | కార్మిక | కె రాఘవులు |
| 189342 | కార్మిక | ఇ రాఘవయ్య |
| 191286 | కార్మిక | రాజగోపాలు |
| 191477 | కార్మిక . | రాజు |
| 191228 | కార్మిక | కె రామాలు |
| 191358 | కార్మిక | ఎ రామయ్య |
| 189372 | కార్మిక | ఎం రుక్మాంగద రావు |
| 191020 | ఎ. గంగరు .. | ఎ సాంబమూర్తి |
| 188171 | కార్మిక | టి శామ్యూలు |
| 191316 | కార్మిక .. | శంకరను. |
| 189360 | కార్మిక .. | ఎస్ సత్యం |
| 189430 | కార్మిక | టి సుందరరావు |
| 189377 | కార్మిక | డలుపులు |
| 191170 | కార్మిక .. | తంగయ్య తేవరు |
| 191028 | వంట . | తంగవేలు |
| 191142 | కార్మిక | ఎం. వీరస్వామి |
| 189476 | కార్మిక | ఎం. వెంకన్న. |
| 189254 | కార్మిక | టి వెంకటేశ్వర్లు |
| 191269 | కార్మిక | ఎం. తాయ్యూరు. |
| 189230 | కార్మిక . | ఎం ఎల్లయ్యం |
| 189266 | కార్మిక | కె విసురత్నం |

MADRAS PRINTED AND PUBLISHED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS